# ప్రకటన.

ఈ గ్రంథము గవర్నమెంటువారి కాపీరైటు రిజిష్ట్రేషను ఆక్టు ప్రకారము రిజిష్టరు చేయబడినది. కావున ఇతరులు ముద్రించకూడదు.

ఈ గ్రంథము వలయువారలు ఈ క్రింది విలాసమునకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

వీరభారతి అండు కంపెని,

నెం. 216, అగ్రహారం ముదలీవీధి, ప్రాంతచాకలపేట, మదరాసు.

# పీఠిక.

---

"అర్జునప్రతిజ్ఞ" యను సరసవంతమైన చిన్ని పొత్తమును గడవఱకుఁ జదివి యిందలి సారాంశమును గ్రోలి యెంతయు నానందించితి. ఇయ్యది తేట తెనుఁగున మృదుమధుర శైలిని వ్రాయంబడి యున్నది. ఇందు గుంతీదేవి వ్రతమాచరింపఁ బూనినపు డర్జునుండు స్వర్గమునుండి యైరావతమును భువికిం దెచ్చుటకై చేసిన ప్రయత్నములును, దన తల్లియొక్క వ్రతమును నిర్విఘ్నముగ నెఱవేర్చు నిమిత్త మతనికిం గలిగిన బుద్ధివివేక ధైర్యస్థైర్యములు మున్నగు కథాంశము మిక్కిలి యింపుగానున్నది. మొత్తమున కిక్కథ చదువువారికి వినోదకరమై కన్పట్టుచుండుటయే కాక, విశేషించి స్త్రీలకుఁ బుత్రవాత్సల్యతయుఁ బురుషులకు మాతృభక్తి దైవభక్తి మొదలగు సద్గుణంబులఁ గలిగింపక మానదని యూహించెద. కావున నీతిదాయకమగు

ఈ గ్రంథమును రచించిన నాకు సహపాఠకు లును, మిత్రరత్నము నగు చందాల - మల్లయ్య గారికిఁ గరుణాసముద్రుండగు సర్వేశ్వరుఁడు దీర్ఘా యురారోగ్య సంపదల నిచ్చుఁగాత! మఱియు నా మిత్రరత్న మిట్టి పెక్కులు ముద్దులు మూట గట్టు గ్రంథములు వ్రాసి యాంధ్రభాష నలంకరించి యాంధ్రభాషాభిమానులకుఁ దిలకమై వెలయుఁ గాత!

ఇట్లు,

జక్కుల - స్వామినాథుఁడు.

---

శ్రీరస్తు.

# అర్జున ప్రతిజ్ఞ.

## వచన కావ్యము.

---

శ్రీమంతుఁడును బుద్ధిమంతుఁడు నగు జనమేజయమహారాజు వైశంపాయనమునీంద్రునివలనఁ బదునెనిమిదిపర్వములతోఁ గూడిన శ్రీమహాభారతమునంతయును జక్కఁగా విని యంతటితోఁ దనివినొందనిచిత్తము గలవాఁడై సారెసారెకు నర్జునుని పరాక్రమంబును నాలకింప నెంచి యాతాపసోత్తముని మొగంబునఁ దనచూడ్కులను నిలిపి, "మునీంద్రా! * పార్థుఁడు చిన్ననాఁడు తనతల్లికైఁ బంతమొనర్చి దేవేంద్రునిపట్టపుటేనుఁగగు నైరావతమును భూలోకమునకుం గొనివచ్చెనని జనులాడుకొనుచున్నారుకదా! అతఁ డేనిమిత్తము ప్రతిన గావించెనో, ఎట్లు వేల్పుటేనుఁగును మనుజలోకమునకుఁ గొనివచ్చెనో యదియును మీవలననే వీనులవిందుగా వినఁగోరెదఁ గావున, నాయందు గరుణించి తద్వృత్తాంతము నానతీయుఁ" డని యడిగిన నారాజేంద్రునకు మునీంద్రుం డిట్లని చెప్పం దొడఁగె.

* పార్థుఁడు=అర్జునుఁడు.

ఓజనమేజయభూపాలా! ధృతరాష్ట్రమహారాజు సప్తసముద్రములచేఁ జుట్టఁబడిన నీభూమండలంబంతయుఁ బాలింపుచుండఁగాఁ గురుకుమారులగు దుర్యోధనాదులును, గౌంతేయులగు ధర్మరాజాదులును భీష్మునియనుజ్ఞచే ధనుర్విద్యాగురుం డగు ద్రోణునివలన సమస్తశస్త్రాస్త్రవిద్యాప్రావీణ్యులై ప్రకాశింపుచు హాస్తినాపురంబున నుత్సాహముతో నుండిరి. ఇట్లుండ నొక్కనాఁడు భీష్మ, ద్రోణ, బాహ్లిక, సోమదత్త, విదుర సుబలాదిముఖ్యజనంబులును, దక్షిణబంధుగులును దనచుట్టుఁ బరివేష్టించియుండఁగా, ధృతరాష్ట్రమహీపతి గాంధారీసమేతుఁడై కొలువుదీరియుండె. అట్టియెడ నల్లనిమేఘమువంటిశరీరమును, నున్నఁగాఁ బ్రకాశించెడి దండాయుధమును, బాలసూర్యునివలె నెఱ్ఱఁబాఱిన జటాభరమును, నలంకారమగు యజ్ఞోపవీతమును, నొప్పిదమగు మృగాజినము గలవాఁడై వేదవ్యాసమునీంద్రుఁడు తనశిష్యవర్గముతోఁ జూచువారికిఁ గన్నులపండు వొనర్చుచు నచటికి విచ్చేసె.

అమ్మహామునీంద్రునిరాక నెఱింగినవాఁడై యారాజేంద్రుఁడును సభాసదులతో నెదురుసని యత్తాపసోత్తమునకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి తోడితెచ్చి యుచితాసనంబునఁ గూ

ర్చుండ నియోగించి యర్ఘ్యపాద్యాదివిధులం బూ
జించి కుశలం బడిగిన నమ్మునిపుంగవుండును సంతు
ష్టచిత్తుండై యాభూపతిసేమం బరసి యెల్లవారిని
గూర్చుండ నియోగించి యిష్టకథావినోదంబులం
దేలుచుండె. అత్తఱి గాంధారీదేవి శిరంబునఁ జక్కఁ
గా జోడింపఁబడిన చేతులు గలదియై * సాత్యవతే
యునకుఁ బునఃపునఃప్రణామంబు లాచరించుచు
"నోమహాత్మా! దయాంబుధీ! స్త్రీ లేవ్రత మా
చరించిన మంచిదగునో, ఏవ్రత మనుష్ఠించిన వారి
కోరికలు ఫలించుచుండునో యట్టిశ్రేష్ఠతరమగువ్ర
తము నా కానతి నొసంగి నన్ను భాగ్యశాలినిగా
నొనర్పుఁ" డని పెక్కుభంగుల వేఁడుకొన నమ్ము
నీంద్రుఁడు † సుబలనందనయెడఁ గరుణకలవాఁడై
కొండొకతడవు యోచించి, "యోసాధ్వీలలామా!
ఓపుణ్యశీలా! నీపుణ్యచారిత్రములను జనులందఱు
వేనోళ్లం గొనియాడుచుందురు. నీ వతిథిసత్కార
ము నన్న దానము నొనర్చి గొప్పవారగు కుమాళ్లం
గని శ్రీమంతురాలవై యొప్పుచున్న దానవు. అగు
టం జేసి యిపుడు నీకోరవలసిన దెద్దియు లేదు. కు
మారులు దీర్ఘాయుష్మంతులై సిరి యభివృద్ధిఁ జెం

* సాత్యవతేయుఁడు= వేదవ్యాసుఁడు.

† సుబలనందన= గాంధారి.

దపలయునని తలంచితివేని యైరావతవ్రతం బాచరించినచో నట్లు కాఁగలదు. కావున నినుఁబోలిన పుణ్యాంగనలు ముఖ్యముగా నీవ్రతమునే యనుష్ఠింపవలయు” నని సెలవొసంగె.

అదివిని యాధృతరాష్ట్రదేవి తనకొక ప్రశ్నయముండినదియై మునీంద్రుం గాంచి “యోకరుణామయా! ఓపుణ్యపురుషా! తాము వచించిన సురకుమారుల * కభ్రగజము భువికిం దెచ్చి పూజింపగలవిధ మెట్లు కలుగఁగలదు? అట్లు కలిగిన నానోము నెట్లు నోమవలయు? అదియంతయుఁ దామే నాకు వివరముగా నెఱింగింపవలయు” నని యడిగిన నత్తెలి దరికిఁ దపోధనుఁ డిట్లనియె.

“ఓయతివా! నీ వానతిచ్చినవిధంబున దేవకరి నిలాతలంబునకుఁ దెచ్చుటకు మానవుల కలవిగాదు. దానికి మాఱుగా బంగారముతో నైనను వెండితో నైనను జేసి పూజింపరాదా యని తలంతువు కాఁబోలు? అట్లు చేయరాదు. ఏలయనఁగా నది † యమరేంద్రునకుఁ దృప్తి నొసఁగదు. కావున మంటితో నొనర్చి యగ్నితప్తము గావించి పూజించుటయే యుత్తమము. నీవు నీనందనులచే శీఘ్రము

* అభ్రగజము = ఐరావతము. † అమరేంద్రుఁడు = ఇంద్రుఁడు.

గా మన్నుఁ దెప్పించి చిత్రకారులచే దంతావళ రూపంబుఁ జేయించి దానిని నానావిధవస్త్రమాల్యాభరణాదుల నలంకరింపఁజేసి షోడశోపచారంబులం బూజించి పిదప బ్రాహ్మణోత్తములకుఁ దనివితీర దానము లొసంగవలయు. అట్లు కావించితివేని * యహ్వాకశాసనుండు నీయెడ సంతుష్టుఁడు కాఁగలఁడు" అని చెప్పి వ్యాసమహాసింద్రుఁడు తనశిష్య సంఘముతో నిజనివాసంబునకుం జనియె. పిమ్మట గాంధారీదేవి తనకుమారులగు దుర్యోధనాదులకుఁ దనయున్న నెలవునకుఁ దోడితెండని చారులతోఁ జెప్పి పంపఁగా వా రానత్తిమానమును గొని వారికడ కరిగి విన్నవించిరి.

అదివిని యానూఱుగురొక్కటిగా గుమిగూడి "యిదియేమియింత? నేఁడు మనతల్లి మనలనందఱి నొక్కటిగా రమ్మని యేలచెప్పి పంపినదో తెలిసినదికాదు. ఒక్కతూరిగా నూర్గురుతో నామెకేమిపని తటస్థించినదో యెఱుఁగము. కానిమ్ము. అట కరిగినఁ దెలియవచ్చు"నని తలపోసికొని యటనుండి కడుసంభ్రమంబునం గదలి తల్లిపాలి కరిగి యాదేవిపాదములకు సాష్టాంగముగా దండప్రణామంబు లాచరించి లేచి నిలిచి "యోజననీ! మా

* పాకశాసనుఁడు = ఇంద్రుఁడు.

మ్మేల పిలిపించితిరి? కతం బెయ్యది? ఆనతిండు”
అని యడుగుచున్న వారిలో నగ్రజుండగు * సుయో
ధనున కాసాధ్వీలలామ యిట్లనియె.

“ఓ పుత్రరత్నమా! వినుము. వేదవ్యాసమహాసీంద్రుండు తనశిష్యగణములతో నిట కరుగుదెంచి యైరావతవ్రతం బనుష్ఠించునట్లు నా కనుజ్ఞనొసంగి చనియె. నే నావ్రత మాచరింపఁ దలంచెదఁ గావున మీరందఱు నొకటిగాఁ గూడి యింద్రునిపురంబున కరిగి యతనిపట్టపుటేనుఁగగు నైరావతంబుఁ గొని వచ్చి పూజింపమందురో, లేక మంటితోఁ బ్రతిమఁ జేసి పూజింపనుందురో చెప్పుఁ” డని రెండువిధములం బ్రశ్నించె.

ఆమాటలను విని దుర్యోధనుం డేమియుఁ దోఁచనివాఁడై కొంతదడ వూరకుండి పిదపఁ దమ్ముల నందఱం గలయ నవలోకించి “సోదరులారా! (తల్లిదండ్రియెడల దయ లేనితనయులు, పుట్టనేమి వారు గిట్టనేమి, పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా) అని పెద్దలు వచింతురు. కావునఁ దనయులు తల్లిదండ్రులయభీష్టముల నెఱింగి నెఱవేర్చుటయే వారికిఁ బరమధర్మము. అట్లు కావింపనివా రిహపరం

* సుయోధనుఁడు=దుర్యోధనుఁడు.

బులకును దూరస్థులగుదురు. అగుటంజేసి మనతల్లి వచించిన రెండుపద్ధతులను మీరు వింటిరిగదా? యీరెంటిలో మన మేది చేయఁగలమో యోచన చేసి చెప్పుఁ" డని యడుగఁగా వారు తమలో "నిది యేమి విపరీతముగానున్నయది. దేవాధిపుండగు యింద్రునిపట్టణ మెక్కడ? మానవులగు మన మెక్కడ? దాని నతనియనుగ్రహము లేక యెట్లు భువికిఁ దేఁగలము. ఒకవేళ నతనితోఁ గయ్యా మొనర్చి తెత్తమని యోచింతమా యది మొదటనే సాధ్యముకానిపని. ఇందుల కేమిచేయువార" మని యోచించి పిదప నెట్టకేలకుం దెలివిఁదెచ్చుకొని "యన్నా! అమరాధిపునికరిం దేవలయునని ప్రయత్నించినచో * స్వర్గమునకును నిటకును ననేక కోట్ల యోజనములదూర ముండవచ్చును గదా. దాని నిచ్చటికిం దెచ్చుటకుఁ బ్రయత్నించినచో బహుకాలము పట్టవచ్చును. ఆకార్య మిప్పటికక్కఱకు సమకూర దని తలపోసి మింట నోనగ్గుటయే మేలని నిశ్చయించితిమి. ఇఁకఁ దమయిష్ట మెట్లో యట్లు చేయుం" డని చెప్పిరి. ఆమాటలను విని సుబోధనుఁడు "నేనును నట్లే తలంచితి. అగుటవలన నంబచెప్పిన రెండవవాక్యము నొప్పునఁ గా

* స్వర్గము=ఇంద్రలోకము.

వింతము రంపు రం"డని వారిఁ దనవెంటఁ బెట్టుకొని పోయి బంకమంటిని ముద్దలుచేసి తమ్ములతలల యుం దిడి తానును నొకముద్ద నెత్తిపై నిడికొనివచ్చి యొక్కయెడఁ గొండవలె రాశివైచి యచ్చటికి శిల్పులను రావించి వారి కామృత్తికను జూపి మీరు దీనిని దివిజదంతావళరూపం బొనర్పుఁడని యుత్తరువుచేసె.

వారును నట్లెయని దమవిద్యాకుశలత నం యఁ జిత్రవిచిత్రంబును రాకాచంద్రసన్నిభంబును నగు చతుర్దంతంబులు గలిగి శుద్ధధావళ్యమై యొప్పు నైరావతాకారంబును సాంగోపాంగముగ నొనర్చి దానిపై బంగరుతబుకు మనిచి కుంభమునకు నవర త్నఖచితములై వ్రేలెడు బంగరుకుచ్చుల నమర్చి నాసమునకు లాగుగా మ్రోఁగెడిఘంటలను గట్టి మేనం బలువిధాభరణంబులఁ గైసేసిరి. అప్పుడక్క డి చూచువారికిఁ గన్నులపండువగుచు వెండికొండఁ దిరస్కరించుచుండె. అంత దుర్యోధనుఁ డంతిపురం బున కరుదెంచి నిజజననిం గాంచి, "అమ్మా! తాము వచించినమేరకు నైరావతాకారంబుఁ దయారు చేయించితిమి. ఇంకఁ దడవుసేయక వ్రతమాచరిం పఁ దామచటికి విచ్చేయవలయు" నని వినయము తోఁ బలికిన కుమారునివాక్యముల కలరినదియై

యాగాంధారీదేవి యతనిం బ్రియంబున వీడుకొల్పి తదనంతరము మంగళస్నాన మాచరించి దుకూల వస్త్రమును గట్టి కస్తూరికర్పూరాది సుగంధద్రవ్యములం గలిపిన శ్రీచందనము మేన నలఁది దివ్యరత్నములను బొదిగిన బంగరుసొమ్ములను ధరించి మేలిమగు పూసరంబులం దాల్చి శృంగారవతియై తన [illegible]డఁ గొందఱు పుణ్యాంగన లరుదేర, మఱికొందఱు ఛత్రములుపట్టఁ గొందఱు చామరంబులు వీవ వారికి ముందు మంగళతూర్యవాద్యము లాకసమును భేదించునట్లు ఘోరముగ మ్రోయుచుండ నానందమిచేఁ బురజను లమ్మహావైభవమును జూచువారై యట కరుదెంచి గుంపులుగట్టి యొకరిపైనొకరుపడుచుండ, బెత్తములం జేతఁబట్టుకొని కొందఱుభటులు బరాబరులు సేయుచుండ, సుందరమగు బంగారుపాలకిపై నెక్కి తిన్నతిన్నఁగా నైరావతి మున్నచోటికి వచ్చుచుండె.

అట్లు వచ్చుతఱి నానాస్థలలాము దూరముననే పాలకిని డిగ్గి పాదచారియై * చౌదంతిని డగ్గఱి దండప్రణామంబు లర్పించి షోడశోపచారంబులం బూజించుచుఁ బరిచారికలకు హస్తినాపురంబునం గలపుణ్యాంగనల నందఱఁ దాఁ జేయు దినిజపుం

* చౌదంతి=ఐరావతము.

తాపళవ్రతమునకుం దోడితెచ్చిన ట్లుత్తరువుచేసిన
వా రట్లు గావించిరి. అనుబలపుత్రియు వ్రతము
ముగిసినవెంటనే యావచ్చినము త్తైదువులకుఁ జీర
లు బసుపు కుంకుమము తాటియాకుచుట్టలు
(చెవియాకు) పోగునూలు పచ్చకర్పూరము తాం
బూలము, నానబియ్యము, ఖర్జూర, కపిత్థఫల
ములు మొదలగునవి క్రొత్తచేటలయం దునిచి
వాయనదానంబు లిచ్చి, యాపిసప బ్రాహ్మణో
త్తములకుఁ దృప్తికరముగ నొప్పులను, బంగార
మును దక్కినవారికిఁ గోరినచొప్పున నన్నిం
టిని దానం బొసంగి సంతసించుచుండె. ఇక్కరణి
నాగాంధారి నోమునోచుతఱిఁ దా నైశ్వర్యమున మో
హితురాలై యుండుటచేఁ దనతోడికోడలగు నాం
తియుఁ దనతోడ నోమవలయునని తలంపక యిరు
గుపొరుగువారలం బిలిచినరీతి నైన నామెను బిలు
వక నోచినదియై పరిచారికలతోడ నంతఃపురము
నకు వెడలిపోయె.

ఈవిషయ మిట్లుండ నచటఁ దనమందిరం
బున నున్నకుంతీదేవి వృత్తాంతమంతయుఁ జక్కఁ
గాఁ దెలిసికొనినదియై తోడికోడలగు గాంధారి
తన్ను నిరాకరించి వ్రతమొనర్చెఁగదా యనువ్యస
నము మదిలో మిక్కుటముగ వ్యాపింప నైఁచరాని

దిష్టై యేకాంతంబున నొక్కెడఁ బన్నుండి మిక్కిలి ఖిన్నురాలై యుండె. అంతకుమున్ను నానావిధశాస్త్రముల నభ్యసించుటకై ద్రోణునిమందిరంబునకరిగిన నర్జునుం డతనివలన నంతయు గ్రహించి భుజించుటకై యింటికి మఱలి తనసహచరులతో ధనుర్విద్యానైపుణ్యంబుఁ జెప్పుచు వచ్చుచుండ, వా రది విని సంతసించుచు "నర్జునా! నీతో సమానుం డీలోకంబున నెవ్వఁడు గలఁడు? నీవు వింటినిఁ జేతఁబట్టి నిలిచితివేని త్రిమూర్తులుసైతము వెఱగందుదురు. ఇంతటిపరాక్రమవంతుఁడ వగుటచే మేము నిన్నాశ్రయించి నిర్భయులై వర్తించుచున్నార" మని స్తోత్రపాఠము లొనర్చి కాలయాపన మగుచున్న దగుఁగ మని యతని నింటికిఁ బనిచి తాము తమయిండ్ల కేగిరి. అర్జునుం డిల్లుఁ జేరి తాను వచ్చునంతకుఁ బ్రతిదినము వివిధోపచారము లొనర్చి యన్నమిడెడి తల్లి నాఁటిదినము కంటికి కగపడక యుండుటచే నమ్మా! యమ్మా! యని పిలుచుచుం బ్రతిగృహములోనికిం బ్రవేశించి చూచుచు నెందునుం గానక విసుఁగుఁజెంది, "యిదియేమిచిత్రము? నేఁడు తల్లి యెటకేగినదో తెలియకున్నదిగదా! నాకుఁ గడుం గడు నాఁకలిగా నున్నదే" యని పరితపించుచుఁ బోవునెడ, నొకవిజనస్థలంబున ముసుఁగిడి చింతా

సాగరమున మునింగినదియై పన్నుండిన జననిచం దంబంతయు నరసి తనలో "నీయమ యిట్లు మునుఁగువైచికొని చింతతో నేకాంతంబునఁ బరుండుట కేమి కారణమో! ఇది యేమివిపరీతమో! ఎవ్వరీమె కెగ్గులాచరించిరో తెలియకున్న"దని వితర్కించి మెల్లమెల్లనఁ జెంగట కరిగి యద్దేవిపాదపద్మముల కెఱఁగి మనము మిగులఁ దొట్రుపాటొందుచుండ నిట్లనియె.

"ఓతల్లీ! నీ విట్లు చింతాక్రాంతురాలవై యుండుటకుఁ గతం బెయ్యది? ఎవ్వరివలన నీ కీమనస్తాపము వాటిల్లె? ఎవ్వరీవిధముగ నెగ్గు గావించిరి? ఎవ్వరు మదముచే నెదుటివారియొక్కయుఁ దమయొక్కయుఁ దారతమ్యము లెఱుంగక నిష్ఠురోక్తులాడిరి? అట్టిదుర్మార్గు లెంతవారలైనను బ్రయత్నపూర్వకముగా వారిగర్వము లడంచి కష్టపెట్టెదను. కావున, నే నొకఁ డుండఁగా నీ కీయవస్థ యెందుకు? ఏల యివ్విధమున సంతాపముచేఁ గంది కొంచెదవు?" అనవుడు నాగొంతి దిగ్గన లేచి యతని నాలింగనము చేసికొని "కుమారా! ఏమి చెప్పుదు? నేఁడు మీ పెదతల్లియగు గాంధారరాజనందన మిక్కిలి వైభవముతో నమరకరి నోమఁగాఁ బురజనులందఱం గనికరముతోఁ బిలిపించినదియై నాయెడ

నసూయచూపుచు నన్నాగ్రవత మొనర్ప రమ్మని పిలువదయ్యె. ఒకవేళఁ దాను బిలువకున్నను నిరు గుపొరుగువారలం బిలిచినరీతి నెవరితోనైనఁ జెప్పి నన్నుఁ బిలిపింపదయ్యె. చూచితివా యెంతయు నాదరణ మొనర్చె ఆహా! మనము తన కెంతచులకఁ నమైతిమి! ఇంతయగాక తాను దనకు నూటుగు రుకుమారులు గలరనియు, మిక్కుటముగ నైశ్వర్య ము గలదనియు మదమెచ్చి కన్నుగానక మనలం దనవదయ్యె. కావున విచారింపఁగా పేదతనము కంటెంగడు హీనమైనదే యగునుగదా! ఏమిసేయవ చ్చును? మీరలో పసిబాలురు. పిన్ననాఁడే మీ తండ్రి మిమ్ములను విడిచి స్వర్గస్థుండయ్యె. అదిమొ దలుకొని మనము పేదపంచం గాచియుండి భాగ్య హీనమగు నన్నమును గుడువఁ బాల్పడితిమి. ఈ బ్రతు కొకబ్రతుకులోఁ జేరినదగునా?" యని చె ప్పుచుఁ గంట నీరు దెచ్చుకొని వేఁడినిట్టూర్పులు నిగుడ్చుచు మిగుల శోకముతో మోము మాడ్చి కొనుచుండె. అదిగని యక్కిరీటి కోపముతో రేఁ గుచున్న చిత్తముగలవాఁడై "యోజననీ! ఆగాంధా రీదేవి తనకుమారులగు దుర్యోధనాదులు నూటుగు రును మంత్రితో నేనుఁగఁ జేయంజాలరని కడుగర్విం చి నిన్నుఁ బిలిపింపకున్న దాన నేమి కాఁగలదనితలఁ

చెదు? నా ప్రతిన వినుము. ఎట్లు తొల్లి రావణుండు, తనతల్లియగు కైకేశీవ్రతము చెల్లించువాఁడై కైలాసపర్వతము నదల్చి యవలీలఁ బైకి లేవనెత్తఁగా నత్తఱిఁ బరమశివుఁడు వానిసత్త్వసంపదకు మెచ్చినఁవాఁడై తనపురంబునఁ గలుగువస్తుకోట్లతని కొసఁగి యావ్రతమును దనతల్లిచేఁ జక్కఁగాఁ జేయించెనో, యట్లే నేఁడు నేనును నీపాదసాక్షిగా బ్రహ్మవిష్ణుమహేశ్వరులు మదీయభుజబలగర్వమును గాంచి మెచ్చుకొను చుండఁగా శాత్రవులచే జయింపఁబడనివాఁడనై కడునేర్పుతో రంభ మొదలగు దేవతాస్త్రీలను, మందారాది కల్పవృక్షములను, గామధేను చింతామణులను నింకను త్రిదశపురంబునం గలసమస్తసంపదలను నైరావతంబుతోడ నిలాతలంబునకుం గొనివచ్చి నీ కిచ్చువాఁడను. కాదేని నీపాదములాన నేఁడు మొదలుకొని శస్త్రసన్న్యాస మొనర్చువాఁడ"నని చెప్పి భయంకరమగు వీరావేశముం బూనినవాఁడై యప్పుడే వింటినిజక్కఁగా సవరించి దిక్కులు చలించునట్లు టంకారధ్వని యొనర్చి సింహగర్జనము గావించి వెంటనే * పాకశాసనునిపేర నొకకమ్మ వ్రాసి బాణపుకొనకుఁ గట్టి యస్త్రగురుం డగు ద్రోణాచార్యుని భక్తితో ధ్యానించి పిదప

* పాకశాసనుఁడు=దేవేంద్రుఁడు.

గొంతికిని ధర్మజ భీమాదులకును నమస్కారము గావించి వారియనుమతి వడసి యుత్సాహముతో బాణమును సంధించి యమరావతికై పూని యందు సుధర్మాసీనుండగు దేవేంద్రునియెదుటనున్న కంబమును గుఱిచేసి కొట్టె. ఆబాణఘాతమునకు దిశలు బీటలువాఱె. భూమండలమంతయు వడవడవడంకె. పాతాళలోకము కుమ్మరసారెవలె దిర్రిరందిరుగాడె. సప్తసముద్రములు కలఁకఁజెందె. ఆకసముననుండి యగ్నికణములు భువిపైఁ దఱచుగాఁ బడుచుండె. ఆదిశేషునియొక్కయు నాదికూర్మముయొక్కయు ఫణములును జిప్పలును వికలమగుచుండె. సమస్త జీవకోట్లు భయముచేఁ దమతమయనయవముల స్వాధీనమును బొత్తిగాఁ గోలుపోయినవి. కులపర్వతము లడుగుభాగములతోడఁ బెల్లగిలి భువిపై నొడ్డగిలుచుండె. వేయేల? సృష్టికర్తయగు బ్రహ్మదేవుఁడే యయ్యుత్పాతమును గాంచి భీతినొందె. ఈరీతిని భయంకరముగా నాదివ్యశర మనేకపిడుగు లొక్కటిగాఁ బడినచందంబున నింద్రునిసభామండపమధ్యస్తంభమునఁ గ్రూరముగా నాటిన నచ్చోనున్న సిద్ధవిద్యాధరగరుడగంధర్వగణంబులు భీతచిత్తులై నిశ్చేష్టం బ్రతిమలచందంబున నిలచియుండిరి. * ఆబి

* బిడౌజుఁడు=ఇంద్రుఁడు.

రాజుండును భయకంపితాంగుండై స్థైర్యము చెడి కొండొకతడవునకుఁ దెప్పిరిలి నలువైపులం గలయ బాఱఁజూచి తనముంగల కంబమునకు నాటియున్న బాణమును దదగ్రమునం గట్టఁబడి వ్రేలుచున్న లేఖ నారసి యచ్చెరువంది యుచటివారిభయము నశించుభంగిని దగుమాటలచేవారి నూరార్చి యాపత్రికను విప్పి చదువుమని తనమంత్రిచేతి కొసంగిన నతండు "శ్రీమదనిమిషలోకభర్తయు, జంభాసురారాతియు నగుపురందరునకు శుభముగలుగునట్లుగా నెంచి శత్రునాశనుండును, శస్త్రవిద్యాపారంగతుండును నగునర్జునుఁడు వ్రాసిపంపినలేఖ యేమనఁగా: మదీయజనని యగుకుంతీదేవి యైరావతవ్రతం బాచరింప నెంచియున్నది. కాన మాయందు దయగలవారై తాము తమయైరావతమును హస్తిపురంబున కనిచి యయ్యామనోము భూతలంబున సుప్రసిద్ధి వహించునట్లొనర్తురని తలంచెద. ఇంతియగాక నక్కరితోడన పారిజాతాదికల్పవృక్షములను, చింతామణిని, గామధేనువును, రంభామొదలగు నప్సరస్త్రీజనంబులను, నింకను దమపట్టణంబునం గల దివ్యవస్తునిచయములను, దేవసంఘములను బంపవలయు. అట్లు పంపుదురేని వ్రతము ముగిసిన మఱునాఁడ తడవుసేయక దమకడకు వాని నంపుదును.

తా రీవిషయమునం బెక్కులాలోచింపక ప్రియత
నూజుఁడనగు నాయందు నెనరుంచి నాకోరినవిత్వ
రగాఁ బంపుఁడు. కాదేని వేయిమాటలెందుకు?
చతురుపాయములలో నాలవదియగు దండనోపా
యంబునఁ దండ్రీననక నిను భండనమున ఖండితము
గా నిర్జించి నిమిషమాత్రములో వానిం గొనివత్తు”
నని గంభీరముగ వ్రాసియున్న కమ్మఁ జదివె.

అదివిని యట నున్న వేల్పు లిపుడేమియుత్పా
తము సంభవించునోకో యని మిణకరించుచు నమ
రేంద్రుని దెసఁ గ్రీగంటిచూడ్కులు తిన్నతిన్నఁగా
నిగుడ్చుచు నిలచియుండిరి. ఆబృందారకేంద్రుండు
ను గోపముతో మిక్కుటముగా వడంకుచున్న యు
ధరోష్ఠములు గలవాఁడై వారల నందఱం గలయ
నవలోకించి “యర్జునుఁడు నన్నుఁ దనకు సేవకునిగా
భావించి వ్రాసినయుత్తరమును మీరలు చక్కఁగా
వింటిరిగదా! ఇందువలన నతఁడు కడుగర్వించి యు
న్నాఁడని తెలియవచ్చుచున్నది. ఆహా! వానిపను
లు సేయుటకే గాఁబోలు నీరాజ్యభార మేను వహిం
చియుండుట. అట్లు కావించిన నన్నెవ్వరు నవ్వకుం
దురు? ఏ నింద్రుండనా? ఇదేమియాశ్చర్యము! దేవ
నాథుఁడనగు నేనెక్కడ? మనుజమాత్రుండగు న
తఁ డెక్కడ? కొంచెమేనియుఁ దారతమ్యము లర

యవలదా? దురభిమానముతో మదీయపట్టపు టే
నుఁగు నిమ్మని యడుగుట తనకుఁ దగునా? మొట్ట
మొదట నణఁకువతో మాటలాడి పిదప శూరాగ్రే
సరునివలె నావంతయుఁ జంకక బిరుదములాడుటచే
వాని కేనెంత చులుకఁదనమైతినో చూచితిరికదా!
అట్టిదుర్మార్గు నెట్లు శాస్తిచేయక విడువవచ్చును"
అని కోపముతోఁ గొంతతడవును, "రణరంగమున
నెదుర్కొని చంపఁబూనితినేని యప్పుడ తనచే
నున్న లోహాయుధమును నాముంగల నిడి శరణార్థి
నగునన్ను రక్షింపుఁడని వేఁడు కొనునేమోగదా!
ఔరా! * బీభత్సుఁడుదక్కఁ యన్యుండొక్కఁ
డింతటి యాగడపువాఁ డెందయినను గలఁడా?"
యని పరిహాసముగాఁ గొంతతడవును వచించినవాఁ
డై పిదపఁ దనలోఁ "బూర్వము భువిపై గొప్పపరా
క్రమవంతు లగురాజు లెందఱెందఱో జనించి యుండ
రా? అట్టివారిలో నిట్టి యమానుష కార్యము నెం
దేనియు నెవ్వరైనను జేసియుండిరా? వీఁడుమాత్ర
ము నేఁ డిట్లు కావించుటం జూడఁగా జగత్తునకే
విపరీతము కలుగఁగలదని తోఁచుచున్నది. ఇంతియ
గాక నారాజ్యమునకు యథార్థముగాఁ గీడు మూఁడు
నట్లున్నది. కాదేని యొకానొకమానవుఁడు ముందు

* బీభత్సుఁడు=అర్జునుఁడు.

వెనుక లాలోచింపక మదీయసంపదలెల్లఁ దన యున్నచోటికిఁ గప్పముగా నిచ్చిపంపు మని యుత్తరము వ్రాసి బాణమునకుఁ గట్టి సభాస్తంభమును నాటునట్టు లక్ష్యముంచి ప్రేషిమెఱయ హుంకరించి యేయఁగలఁడా?” అని కొంతసేపు భీతితోడ నాలోచించి పిదప నెట్టకేలకు ధైర్య మవలంబించి రోషంబుఁ బెంచి సంవర్తబలాహకాదిమేఘవ్రాతముల రావించి, “మీర లతిసత్వరంబుగాఁ జనుదెంచి గర్వగరిష్ఠుండయిన * పాండవమధ్యమునకునికిపట్టగు హాస్తినాపురంబుం జుట్టు ముట్టడించి యిరువదియొక్క యహోరాత్రంబులు కల్పాంతసమయోద్రేకంబుగా వర్షించి యందుఁ గలమేడమేడలు నగరప్రాకారములు, గోపురద్వారములు మొదలగు వానిని నుగ్గునూచము గావించి, సర్వప్రాణుల సమయించి రండు. అతం డేమిచేయఁగలఁడో చూత” మని వాని కాజ్ఞ నొసంగె. అదియంతయు నాసభామధ్యముననుండ వినుచున్న వివేకవిశారదుం డగు నారదుండు లేచి † పురందరునకభిముఖుండై యాసనంబునఁ జిఱునగ వంకురింప నతని కిట్లనియె. “ఓ దేవేంద్రా! ఇది యేటియాగడము! విజయుని సా

* పాండవమధ్యముఁడు=అర్జునుఁడు. † పురందరుఁడు=దేవేంద్రుఁడు.

మాన్యునిగా భావించి మేఘజాలంబును బుగ్గించ యత్నించుటవలనఁ బ్రయోజనము లేదు. అతఁడు దానమున బలికిని, పరాక్రమమునఁ గుమారస్వామికిని, ధైర్యమున మేరువునకును, గాంభీర్యమున సముద్రమునకును, సౌందర్యమున నలకూబరునకును, శాంతిని భూమికిని, ధర్మమున యమధర్మరాజునకును, సత్యమున హరిశ్చంద్రునకును, బుద్ధిని బృహస్పతికిని, వాక్కున శేషునకును, వైభవమున నీకును, ధనమునం గుబేరునికిని, నైశ్వర్యమున శివునకును, విద్యల బ్రహ్మకును, దయను బుద్ధదేవునికిని సమానుండని తలంపుము. ఇంతియగాక వెండియు నొక్క పరమరహస్యము గల దది చెప్పెద శ్రద్ధావధానుండవై యాలింపుము. ఎద్దియన, తొల్లి దేవతలచేఁ బ్రార్థింపఁబడినవారై యెవరు దుష్టనిగ్రహశిష్ట పరిపాలనార్థము మానవులమై జన్మింతుమని వక్కాణించి యుండిరో యట్టినరనారాయణు లిపుడు భూలోకమున మనుజులై యవతరించి యున్నవారు. వారిలో మొదటివాఁడగు నరుఁడే యర్జునుఁడని గ్రహింపుము. ఇఁకమీఁదట నయ్యిరువురును నీకు శాత్రవులగువారిని యుద్ధరంగమున సునాయాసముగా హతము గావించి శీఘ్రకాలములో విజయలక్ష్మిని సంపాదించి మిక్కిలి యుపకార మొన

ర్పఁగలరు. అది పిమ్మటఁ గాంచెదు. నీ వెన్ని విధము లనైన మాహితోక్తి నంగీకరించి పాండుభూపాలపుత్రుని కోర్కెఁ దీర్చుటయే మేలని తోఁచుచున్నది. చూచితివా! ఆగొప్పవిలుకాఁడగు విజయునియాజ్ఞ లేక గంబమునకు నాటియున్న యీదివ్యశరము దాఁకుటకు నంబుజభవాదులైనను వెఱతురు. అట్లగుటచే నీ కతనితోఁ బగఁ గొనక యుండుటయే గొప్పకర్జమని నాకుం దోఁచుచున్నది." అని పలికిన *యరవిందసూతితనూజునివచనములకతండాత్మ నలరి "యిమ్మునీంద్రుండు చెప్పినదంతయు నిక్కువముగా నేయుండవచ్చును. ఉండినను నే నాతీరునఁ గావింతు నేని కొందఱాలుంగినివా ఇంద్రుండొకసామాన్య మనుజునకు వెఱచి తనయైరావతంబును గానుకగా నిచ్చెనని వాడుకొనకుందురా" యనియుఁ "బంపకుండునేని యిత్తపోధనుండు సెప్పిన క్రమంబునఁ బిదప మేలు గలుగుట యటుండనిమ్ము. ఇప్పు డనర్థముగా నాకుఁ గీడు మూడక మానదు. ఆహా! ఇందులకేమిసేయువాఁడను? ఏయుపాయమున నీయాపదం బాపుకొననేర్తు" ననియుఁ దనలో నాలోచించి కొంతవడి కైరావతము మదించియుండుట జ్ఞప్తికి రాఁగా "కాని మిమ్మా నెపమునఁ దప్పించుకొన

* అరవిందసూతితనూజుఁడు=నారదుఁడు.

వచ్చును. పిదప దైవాధీన మెట్లున్నదో చూత” మనితత్తణంబ పార్థునిపేర నొకచీటి వ్రాసి ప్రచండ నాముఁ డనెడుదూతం బిలిపించి “నీవు రయంబునఁ గరిపురంబున కరిగి * కిరీటిం గాంచి దీనినొసంగి యు తం డేమిసెప్పునో యదివిని వేగిరంబ మఱలిరమ్మని యాయుత్తరమును వానిచేతం బడనేసె. వాఁడా † త్రిదశవల్లభుని యాజ్ఞను శిరసావహించి సత్వరముగ వెడలి హస్తినాపురంబుఁ జేరి యం ‡ దజాతశత్రుని గూర్మితమ్ముండగు ♦ ధనంజయునిం గాంచి వందనశతంబు లర్పించుచు “నోశూరాగ్రేసరసింహామా! ఏ నమరాధీశునిబంటను. నాపేరు ప్రచండుం డం దురు. అతఁడు తమ కీలేఖను సమర్పించి రమ్మని పుత్తెంచఁగా వచ్చితి” నని వినయమునఁ బలుకుచు దాని నతనిసన్నిధి నునిచె.

❦ నరుం డాదూతభయభక్తి విశ్వాసంబుల కెంతయు నాత్మ నలరి యాకమ్మను జేతి కందు కొని దనయన్నదమ్ములు పెద్దలు మొదలగు వారి సన్నిధికి గరణమును రావించి యాపత్రిక నతనిచేతి కొసంగిన వాఁడు “శ్రీమత్సకలలోకనాయకుఁడును,

---

* కిరీటి=అర్జునుఁడు. † త్రిదశవల్లభుఁడు=ఇంద్రుఁడు.
‡ అజాతశత్రుఁడు=ధర్మరాజు. ♦ ధనంజయుఁడు=అర్జునుఁడు.
❦ నరుఁడు=అర్జునుఁడు.

జరామరణవర్జితుఁడును, నమరగణాధీశ్వరుఁడును, భయంకరశత్రురాక్షసమదగజసింహుండును, నపారవిక్రముండును, నసమానశ్రీమంతుఁడును నగు సునాసీరుండు చంద్రవంశసాగర సంపూర్ణచంద్రుండగు నర్జునునియెడలఁ బ్రియము కలవాఁడై వ్రాయున దేమనఁగా: ఓపుత్రరత్నమా! నీవు మీతల్లినోము నకై నాకుఁ బంపినపత్రికం దిలకించి కడుంగడు సంతసించితి. లోకమునఁ దండ్రియైశ్వర్యమునకు సుతు లర్హులు గాకయుందురా? కావున నీకోరినవి పంపుట కేలాటియభ్యంతరమును లేదు. అయిన నొకటి వినుము. మదీయదంతావళ మిటీవలఁ గొన్ని నాళ్లనుండి మదించినదియై మావటీలను లక్ష్యపెట్టక యుండుటచే దాని నణఁచుట కేరికి సాధ్యము గాక యున్నది. అగుటంజేసి యది యె ట్లేమార్గమున నీపురమునకు వచ్చి చేరఁగలదని సంశయించెద. ఇందుల కెద్దియేనియు నుపాయ ముండినచో నాలోచించి చెప్పుదువేని తప్పక యాలాగునఁ గావించుటకు సిద్ధముగా నున్నవాఁడ" నని చదివె. అయ్యింద్రుని లేఖావృత్తాంతమును విని ధర్మజాదులు సంతసించినవారై యాసామజరాజమును మనలో నెవఁడు పట్టి తేఁగలఁడొకో యని యొకరినొకరు హెచ్చరించుకొని పిదప నిక్కార్యమునకు భీమసేనుఁడు

దక్క నన్యులు గాంచఁగారని నిశ్చయించిరి. తరువాత *ఫల్గునుఁడు దేవదూతం గనుంగొని "యో ప్రపంచదా ఖ్యా! నీవు మీ ప్రభునితో నే నతనివాక్యముల కెంతయు సంతసించితిననియు నైరావతము నెవరు గొనిపోఁగలరో యేమార్గమునం బంపువాఁడనో యనెడిసంశయము తనకు వలదనియు బ్రహ్మవిష్ణు మహేశ్వరులు మదీయ శరవిద్యాకౌశలతం గాంచి తమలో నరుసందుచుండఁగాఁ బెక్కు బాణములచే మంటికిని మింటికిని సుందరమగు సోపానచయం బుం గట్టుదుననియు నట్లు గట్టినవెంటనే మాలో నొకని నట కంపుదుననియు, వానివెంట నాకోరిన సమస్తము రయంబునం బంపవలయుననియుఁ జెప్పుము. ఒకవేళ నదేనియుఁ గృత్రిమప్రయత్నమునకుం దలపడెనని పిమ్మట నేమి కాఁగలదో యది తనకే తెల్లము కాఁగలదనుము." అని యీరీతిని వానితోఁ జెప్పి పంపఁగా వాఁడును దనరాకకై యెదురుచూచుచున్న † శతమన్యునిపాలికిం జని పాండవమధ్యముఁడు తనతోఁ జెప్పుమని చెప్పిపంపినదంతయు నతనితోఁ బూసగ్రుచ్చినచందమున విన్నవించె. అదివిని యప్పాకారియు విస్మయమంది తనలో "ని దేమివింత! సురలోకమునకును మనుజలోకమున

* ఫల్గునుఁడు=అర్జునుఁడు. † శతమన్యుఁడు=ఇంద్రుఁడు.

కును వేనవేలయోజనములదూర ముండవచ్చును గదా? ఇంతద వ్వెట్లకిరీటి శరపథంబుఁ గట్టఁగలఁడు. ఇది మహాదాశ్చర్యముగ నున్నయది" అని యాలోచించుచు "నే నెంతబుద్ధిమాంద్యము కలవాఁడనైతిని. తొల్లి యొకబాణమును సంధించి మఱియు సభాస్థలంబంతయుఁ గలఁగుడు వడఁజేసినయతం డింత కాపింపక మానునే? యమ్మహానుభావుఁడు నారదమునీంద్రుండు సెప్పినవిధంబున నారాయణాంశజనితుం డగుటంజేసి నిశ్చయముగాఁ దనకార్యమును నెఱవేర్చుకొనఁగలఁడు. నే నెన్నిభంగులఁ గాని ప్రయత్నము లొనర్చినను దుద కది నిష్ఫలప్రయోజన మగునుగాని వేఱొండు గా" దని తీర్మానించుకొని చేయునది లేక యూరకుండె.

అది యట్లుండఁగా నిట ధర్మనందనుండు గాంగేయధృతరాష్ట్రవిదురాది పెద్దలతోఁ గలసి కార్యాలోచన మొనర్చి వారియనుజ్ఞ వడసి సమస్త రాజాధిరాజులు తనతల్లిర్వతమును నేత్రోత్సవముగాఁ దిలకింప హస్తినాపురంబునకు రయంబున విచ్చేయునట్లు చారులతోఁ జెప్పి పనిచె. ఆవృత్తాంతము విని యేఁబదియాఱుదేశములందలిరాజు లందఱును (రథగజతురగపదాతు లనెడి) దమతమచతురంగ బలంబులతోఁ గూడికొనినవారై సైన్యభారమున

కష్టదిగ్గజములును, నాదిశేషుఁడును, నాదివరాహ
కూర్మములును మిక్కిలి చలించుచుండఁగా బుడమి
యూనినచందమున గరిపురంబునకు వచ్చి చేరిరి.
అయ్యెడ ధర్మసూనుఁడు వారినందఱిని దగుభంగిని
సత్కరించి యోగ్యస్థలంబున విడిదిచేయించి మజ్జ
నభోజనాదులఁ దృప్తి నొందించుచుండె. తదనంత
రము విజయుఁడు పెద్దలవలనఁ దనతల్లివ్రతమునకుఁ
గెందామరపుష్పములు వలయునని యెఱిఁగినవాఁ
డై వానిజాడ విచారించి భూలోకమున లేవనియు
లంకాపురంబున నున్నదనియును దెలిసికొని తత్ర
ణంబ రావణానుజు నుద్దేశించి "శ్రీమంతులును
బుద్ధిమంతులును నగురాక్షసవంశజులకుఁ బ్రభుండ
వై యొప్పుచున్న విభీషణా! ఎవఁడు సంగ్రామరంగ
మునం బగతురఁ బరిమార్చి తనకీర్తిని సమస్తదిక్కు
లయందు వ్యాపింపఁ జేసెనో, ఎవఁడు పరమశివుని
మెప్పించి యతనివలనఁ బాశుపతాస్త్రమును బడ
సెనో, ఎవఁడు శూరాగ్రేసరచక్రవర్తి యనుబిరుద
మును గైకొనెనో అట్టియర్జునుఁడు నీకు నమస్కార
పురస్సరముగా వ్రాయునదేమనఁగా: మాయంబ
వ్రతమునకుఁ గెందామరలు కావలసియుండుటచే
వానిని భూలోకమున వెదకించి యెందుఁ గానక
వేసరి తుదకు నీరాజ్యమునం గలవని పెద్దలవలన

వింటి. కాన నీకు నాయందుఁ బ్రియముకలదేని తడ వుసేయక సత్వరముగా వానిం గోసి మాపురి కనుపవలయు. అట్లు చేయకుందువేని నీవు మదీయ బాణసముదయంబులచే మ్రందఁగలవు." అని యొక జాబు వ్రాసి దానిని బాణముచివర నంటఁ గట్టి వింటి నెక్కిడి యమ్ములికి నల్లెత్రాటిమధ్య మునిచి సముద్రములు కలఁకఁబాఱునట్లు టంకా రధ్వని యొనర్చి లంకాపురిపైకిం బోవనేసె. అయ్యది పాఱుతెంచెడందముగల రక్కసు లూపిరి లేనివారలై వెలవెలఁ దన్నుకొని భూమిపైఁ బడు చుండ ననేకకోట్లపిడుగు లొక్కుమ్మడిఁ బడిన చందంబున విభీషణుని మేడకంబమునకు నాటెం. అట్లు నాటినయంబకమును నిశాచరభర్త గాంచిన వాఁడై తనలో నరుదందుచు "నౌరా! యీబాణ మెచటనుండి యిచటికి వచ్చి నాటినది. దీనిఁ బ్రయోగించిన మేటివిలుకాఁ డెవఁడు? అహా! యిది వఱకును నిట్టిచిత్రము నెన్నఁడును జూచి యెఱుఁగనుగదా! అమితపరాక్రమవంతులని పేరువడసిన నాభటులందఱు దీనిధాటికోర్వఁజాలక నేలంబడి పీనుఁగులవలె మూర్ఛితులై యున్నవారు. ఇదయేమి విపరీతనిమిత్తసూచకమో" యని తలంచుచు వారి ననేకోపచారములచే మూర్ఛఁదేర్చి పదంపడి యా

బాణపుచివర వ్రేలుచున్న కమ్మఁ దిలకించి విప్పి కర
ణమును రప్పించి దాని నతనిచేఁ జదివించి యంత
యుఁ దెలిసికొని సంతసించి సభ నంతయు నెగాదిగఁ
బాఱఁజూచి "పరాక్రమశీలురగు రాత్రిచరులారా!
మనకరణము చదివినదంతయు వింటిరా? ఈభూ
మిని బాలించుచున్న రాజులలో నిదివఱ కెన్నండే
నియు నెవఁడైన నిట్లు చేయఁగాఁ జూచియైనను విని
యైన నుంటిరా? ఈసాహస మితనికిఁదక్క త్రిలో
కములయం దెవరికి గలదు? అగుటవలన మన మితని
మానవమాత్రునిగాఁ దలంపరాదు. ఈమహాను
భావుఁడు మున్ను దేవతల మొర నంగీకరించి దుష్టు
లను సంహరించి శిష్టులను బరిపాలించుటకై కోస
లాధిపతి యైనదశరథమహారాజునకుఁ దనయుఁడై
పుట్టిన శ్రీరామచంద్రునకు సమానుం డగునని
తలంచెద. ఈతనికార్యము మనము శిరసావహించి
శీఘ్రముగా నెఱవేర్పవలసియున్నది. అట్లు చేయని
యెడ మనకు గొప్పప్రమాదము తటస్థింపక మాన
దు. కావున మీర లిపుడు సత్వరముగా వెడలి
మనపురంబునంగల సరోవరంబులన్నియుఁ గలయ
వెదకి యత్తమ్ములం గోసికొని హస్తినాపురంబున
కరిగి యట బీభత్సునికిం దక్కఁ దక్కినవారి కంటి
కగపడక వాని నతని కొసంగి రం" డని చెప్పె.

అదివిని వారిలోఁ గొందఱు రాక్షసవీరులు విఱ్ఱవీ గుచుఁ దమరాజునాజ్ఞ తలఁదాల్చి యతనివలని యుత్తరువును బొంది యచటు వాసి చని లంకా పురంబునం గలకొలంకులన్నియు శోధించి తమకు వలసిన పుష్పసమితిం గోసికొని యశరీరులై యా కాశమార్గమున సప్తసాగరము లవలీలం దాఁటి యెడనెడఁ గల పత్తనంబుల విలోకించుచుఁ బోయి పోయి ముందటఁ బరాక్రమవంతులగు క్షత్రియుల కునికిపట్టుగాఁ గలదియును, గోరఁదగినసమస్తవస్తు వులు తనయందుఁ గలదియును, గొప్పయగడ్తలచేఁ జుట్టఁబడినదియును, జక్కనికోటలు గలదియును, బొడవగు సౌధములచే నొప్పునదియును, (రథగజ తురగపదాతులనెడి) చతురంగవర్గములచే నిండినది యును నగు హస్తినాపురంబుం గని గవనులు దాఁటి పురిలోనికిం జని యందుఁగల చిత్రవిచిత్రం బుల కెంతయు నానందించుచు మనలంకాపురం బిప్పురంబునకు సాటి కాఁజాలదని యొకరికొకరు సెప్పికొనుచు నెట్టయెదుట సుందరముగ గన్పట్టు చున్న బంగరుమేడలోనికిం జని యందు నొక్కెడ రత్నమయంబై వెలింగెడిబంగరుపీఠముపైఁ గూర్చుం డియున్న ఫల్గునిం గాంచి మనప్రభుం డానతిచ్చిన నరుం డితఁడే కాఁబోలు నని నిశ్చయించి తమతమ

నిజరూపంబులం దాల్చి యతనిముందు నిలిచి జోహారు లొనర్చుచు, "అయ్యా! మేము లంకాపురాధీశుం డగువిభీషణునిభటులము; అతఁడు తమ కీకెందామరవిరుల నిచ్చి రండని మమ్ముఁ బనిచిన వచ్చినార" మని యావిరు లతనిముం దిడిరి. విజయుఁడు వానిం గాంచి సంతసించినవాఁడై "యోరాత్రించరులారా! మీయేలికకు నాయందుఁ గల యనురాగమున కేనెంతయు సంతోషించినాఁడ ననియు, నిరంతర మతనిసేమమును విచారించుచుందు ననియుఁ, దనకంటెను రొండొకఁడు నా కాప్తుఁడు లేఁడనియుఁ జెప్పుఁ" డని చెప్పి వీడ్కొలిపిన వారలైయని మఱలి లంక కరిగి యావద్విషయమును విభీషణున కెఱింగించి యతనివలన మన్ననఁ బడసిన వారైరి.

ఇట్లు గిరీటి తనకు విభీషణుఁ డంపినపుష్పములఁ దనసోదరులకుం జూపి "మీరింకఁ దడవు సేయక వ్రతానుష్ఠానకాలముసర్ణియుంపుం" డని పలికి పరిచారికల నటకు రావించి వారితో "నీపుష్పముల మాజననివ్రతమునకుఁగా లంకాపురినుండి తెప్పించితి గాన వీనిం జాగరూకతతోఁ గొనిపోయి యామె కొసంగుఁ" డని చెప్పి యిచ్చి పంపె. వారవి గొని పోయి యద్దేవిముందటఁ బెట్టి వర్తమాన మెఱింగింప

గొంతి మిక్కిలి సంతసించినదియై తనలో "నాహా! నాభాగ్య మేమని చెప్పవచ్చును! మానవలోకమున లేని యీపూవులను నాకొఱకై ఫల్గునుం డతిప్రయాసమున నసురలోకముననుండి తెప్పించెనఁట. ఆహా! నేఁడుగదా నేను ధన్యురాలనైతిని. నేఁడుగదా నేను శివునిఁ బూజింపఁ బాత్రురాలనైతిని. నేఁడుగదా నానోము ఫలించినది!" అని తలంచుచుండె.

అప్పు డప్పురంబున మూఁగియున్న రాజలోక మీధనంజయుం డెప్పుడు తనపరాక్రమము మెఱయ భూమ్యాకాశంబుల కంపతెరువుఁ గట్టి యీమార్గమున నైరావతాదుల నిలువఁ దేఁగలఁడో, ఎప్పు డది నేత్రోత్సవముగాఁ జూడఁగలమో యని యొకరితో నొకరు గుసగుస లాడుచుండిరి. అత్తఱి ధర్మనందనుండును బెద్దలవలన నొకశుభదినంబు నిశ్చయించి పురంబు శృంగారింపఁ జారుల నియోగించిన వారిప్పటం గలప్రతియింటితిన్నియలం గస్తూరిని మేదించిన శ్రేష్ఠతరమగు పన్నీటితో నలికి పచ్చకప్పురపుఁబలుకులతోడను, ముత్తియములతోడను ముగ్గులువెట్టి బంగరు యరఁటికంబములను ద్వారములకుం గట్టి ప్రతివీధులయందును నానావిధపట్టుబట్టములతోడను,గలువ పూదండల

తోడను దోరణము లొనర్చిరి. ఇట్లాపురము సకల విధాలంకారముల కాటపట్టై రెండవయమరావతి యుంబోలె నొప్పుచుఁ జూచువారికి నేత్రోత్సవమును గొలుపుచుండె. అంతఁ బురంబు నూతనముగా నలంకరింపఁబడుట నర్జునుఁడు గాంచి సంతసించినవాఁడై పెద్దలయనుమతంబున నిరంతరము గంధపుష్పాక్షతలచే నలంకరింపఁబడినదియును, విజయలక్ష్మికి నివాసస్థానంబై యొప్పునదియును, భయంకరశస్త్రాస్త్రసమన్వితమైనదియునునగు నాయుధాగారముం బ్రవేశించి తనమదిలో బ్రహ్మవిష్ణుమహేశ్వరులను భక్తితో ధ్యానించి పిదప ధర్మనందనునకును, గొంతికిని బ్రాహ్మణోత్తములకును వినయముతో వందనము లాచరించి యందున్నవింటి నవలీలం బుచ్చుకొని పరాక్రమవంతుఁడై విజృంభించుచుఁ జూచుచున్న రాజులకు భయమును, నాశ్చర్యమును జనింపఁగా నెక్కుపెట్టి సమస్తదిక్కులు బీఁటలు వాఱునట్లుగా నారిని మ్రోయించి యొకబాణమును సంధించి యాయొకటి పది, పది నూఱు, నూఱు వేయి, వేయి పదిలక్షలు, పదిలక్షలు పదికోట్లు, పదికోట్లర్బుదములై కడపట లెక్కించుట కలవిగాక వృద్ధినొందించి హస్తినాపుర బహిరంగ

ణము మొదలు అమరావతికోటకొరడు వఱకు సోపానమార్గమునుగట్టె. ఓజనమేజయా! ఇక్కరణి నర్జునునిచే విడువఁబడిన బాణవేగమునం బొడమిన మారుతముచే దిక్తటంబులం గలకులపర్వతము లొడ్డగిలి తఱుచుగా భువిపైఁ బడుచుండె. సప్త సముద్రములు దిరుగుడుపడుచు వికలతనొందె. మేఘములవరుసలు చెల్లాచెదరయ్యె. సమస్తనదులు దమలోని నీటిని వెనుకవైపున కెగఁదన్నుచుండె. లోకము లన్నియుం గలఁతనొందె. అయ్యుత్పాతముం గనుంగొని సురలు బెగడందిరి. అమరేంద్రుండును నతనిపరాక్రమమున కచ్చెరువంది యచ్చో నున్నత్రిదశులను దిక్పాలురను గలయ విలోకించి "చూచితిరే యీసాహసంపుఁగృత్యము! ఇది యితనికే చెల్లును. మనము పూర్వము రఘుకులనాయకుం డగుశ్రీరామచంద్రుం డనేక మర్కటుల సహాయముగాఁ గొని వారిచేఁ గొండలను దెప్పించి సముద్రమునకు వంతెనఁగట్టినదే గొప్పకర్జమని తలంచుచుంటిమి. అట్లుగాక నేఁ డక్కిరీటి యొకసాయకమును సంధించి దాన ననేకములు వోడము నట్లుచేసి వానిచే నాకసమునకును భువికిం *దాపలు గట్టె. కావున నవ్వీరాగ్రేసరునియభీష్టమును దీర్చ

* తాపలు=మెట్లు.

టయే మనకు మంచి"దని వారితోఁ జెప్పి "నేను మున్నే దేసి యొక నెపమున నీయాపదం బాపికొన వలయునని యెంచి మదీయపీటికిని హస్తినాపురంబునకును మార్గము లేమి చేతను నైరావతము మదించి యుండుట చేతను నీ చెప్పినయవి యంపుట కసాధ్యముగా నున్నదని యీ రెండు విషయముల జాబు వ్రాసి పంపినందుల కతఁడు ప్రచండాఖ్యునితోఁ జెప్పి పంపిన రెండు విషయములలో నొకటి నెఱవేఱినది. రెండవ దానికిం దనవారిలో నొకని నంపుమ ననియె. ఆవచ్చెడివాఁడును యెంతవాఁడో యదియుఁ బరీక్షింతము కాని" మ్మని తనకుఁ దా ననుకొని యూరకుండె. అది యట్లుండ నిట ధర్మజభీష్మాదులు భీమసేనుం గనుంగొని "నీవు నీసోదరుఁ డొనర్చిన సోపానమార్గమునఁ బురందరునిపురంబున కరిగి యతనియెడ వినయవిధేయుఁడవై మెలంగి మనము నిశ్చయించుకొన్న శుభలగ్న మాసన్నము గాకమున్నె మనపురంబున కైరావతముఁ గొని రావలయు. అందఱము నీరాకకె యెదురుచూచుచుందుము. త్వరగాఁ బోయి ర"మ్మని చెప్పిన వాయుపుత్రుం డందులకు సమ్మతించినవాఁడై దివ్యవస్త్రమాల్యాభరణాదుల నలంకృతుఁడై గదాయుధమును మూపుపై నిడికొని పెద్దల కందఱికిని బోయివత్తు నని చెప్పి

నమస్కారము లొనర్చి వారిచే నాశీర్వాదములం గొని కవ్వడి యొనర్చిన శరపథంబున నమరావతి కరిగి నగరిద్వారమునఁ గాపున్న చారులు గని వానితో "నే నజాతశత్రునిగూర్మితమ్ముఁడ; నాపేరు భీముఁడందురు. అగ్రజునిపంపున నైరావతముం గొనిపోవుటకై యిటకు వచ్చినాఁడ. కావున నీవృత్తాంతమును మీప్రభువగు పాకశాసనుని కెఱింగింపు" మనవుడు వాఁడు వల్లెయని చని యావృత్తాంతమునంతయుఁ బురందరునితో విన్నవించిన నతండు విని, "ఔరా! ఇదేటియాగడము! మిక్కిలి మదించియున్న మదీయదంతావళము నీభీముఁడు గొంపోవఁగలఁడు? వీనివలన నగునా! కాఁజాలదు. తుదకు వీఁ డిక్కరీంద్రమువలన మడియుట సిద్ధము. తెలిసి తెలిసి ప్రాణమును బోకార్చుకొనఁ దలంచిన వీని వెఱ్ఱితనము నేమనవచ్చును? "వినాశకాలే విపరీతబుద్ధిః" అనుమాట యథార్థమయ్యెఁగదా! కాని మ్ము! అట్లు జరిగెనేని మఱల నికార్యమునకు మఱియొకఁడు తలపడఁడు. ఒకవేళ నరుఁడేవచ్చెనేని యతఁడు నారాయణాంశ సంభూతుండగుటం జేసి నెఱవేఱవచ్చును. అది యప్పుడు చూచుకొందు" మని తనలోఁ దలపోసి యటనున్న సభ్యులం గనుంగొని "మీర లెవ్వరును భీమునితోడఁ గరియున్న

నెలవునకుం బోకుఁ"డనియాజ్ఞాపించి నిరభ్యంతరము గా వాని నిట కంపుమని భటున కుత్తరువుచేసిన, వాఁడు భీమునికడ కరిగి, "అయ్యా! మాయేలిక మిమ్ము నిరాటంకముగాఁ బంపుమని నా కుత్తరువు చేసిరి. లోపలికిం బొం"డని చెప్పె. అందుల కాము రున్నందనుఁడు మఘవునకుఁ దనయందుఁగల గౌర వమున కెంతయు సంతసించుచు, నచటనుండి కదలి యనేకద్వారములం గడచి లోనికిం జని యం దొక్కెడ దిక్పాలురును, మహర్షులును, సిద్ధులును, సాధ్యులును మొదలగువారు పరివేష్టించి యుండ సుధర్మామధ్యమునం గొలువుదీరియున్న విబుధవల్ల భునిం గాంచి కరములు మొగిడ్చి నమస్కరించుచు నిలిచియున్నయతనిం గని శతమన్యుఁడు దటాలున సింహాసనంబు డిగి యాలింగనము చేసికొని తగుపీ ఠము నొసంగి సేమమును విచారించి పిదప "మా రుతీ! ఏను మున్నె కరి మదించియున్నదనియు దానిం బట్టుట కేరి కలవిగాకున్నదనియుఁ జెప్పి పంపితినిగదా! అగుటవలన నిపుడు దాని నీవ పట్టు కొని పోవలయు" నని చెప్పిన నది వినినవాఁడై యా గాఢ్ఢపట్టి మిక్కిలి సంతసించి యట్లే చేయుదు నని యతని సెయ్యకొలిపి యదియున్నచోటు నడిగి

మారుతి=భీముఁడు.

తెలిసికొని యచటికిం బోయి దానిం బట్టుటకు సమీపింపఁగా నది గీపెట్టుచుఁ దొండము విసరుచు దగ్గఱకుం జేరనీయకున్న నతం డలిగినవాఁడై తన దక్షిణకరంబుఁ జాచి దానితుండమును బట్టికొని ముందువైపునకు లాగి తటాలున వంగి వామహస్తమున దానిపాదములం జేర్చిపట్టి క్రిందఁ బడఁ ద్రోసి నాల్గుపాదములను దుండమును నొక్కటిగాఁ జేర్చి యినుపగొలుసులచే బిగించి మూటకట్టుగాఁ గట్టి యాపాదములమధ్య గదాయుధముం జొనిపి పైకిఁ దూకి వీపున వైచికొని తేనిసన్నిధికి వచ్చి "నేఁ బోయివచ్చెద సెలవొసంగుఁ" డని నమస్కరించె. భీముఁడు విశాలమగు ఱొమ్ముభాగముగల వాఁ డగుటచేఁ దన మూఁపున వ్రేలుచున్నగజమింద్రునికంటె కగపడమినందున నతఁడు "ఏఁ డైరావతముచే శిక్షింపఁబడి చావకఁ దప్పించుకొనివచ్చెంగాఁబోలు" నని సిగ్గుపడి నవ్వుచు "భీమా! అదేల నివచ్చినకార్యమును నెఱవేర్చుకొనక రిక్తహస్తుఁడవై నాతోఁ బోయివచ్చెదనని చెప్పుచున్నాఁడవు. ఏమి వృత్తాంత" మని యడిగె. అందుల కాభీమసేనుఁడు దనమొగంబునం జిఱునగవు మొలకలెత్తఁగా "విబుధేంద్రా! ఏ నొకప్పుడును నాకార్యమును సాధించుకొనక వ్యర్థుఁడనై పోవువాఁడను గాను. తమయై

రావత మిదిగో నీఁపుపై నున్నది చూడుఁ" డని యక్కరిని భువిపైఁ బడవేసె. ఆసాహసముం గని సభయందున్న దేవతలును, సిద్ధులును, విద్యాధరులును, కిన్నరులును, కింపురుషులును మొదలగు వారు తమలోఁ గొంద "ఆహా! ఇది యేమివింత? పూర్వము * నిలింపబృందము లచ్చెరువందుచుండఁ గాలోకవిద్రావణుం డగురావణునియురము నెద్ది తన దంతముచేఁ బొడిచిచిహ్నము గావించెనోయది నేఁడీభీమసేనునివీఁపునఁ గుక్కపిల్లవలె వ్రేలుచుండెఁ గదా" యని తలంచువారును, మఱికొంద "ఱితనికిఁ బది వేల యేనుఁగులబలముకలదని తెలిసినవారు వచింతురు. అంతటివాని కొక యేనుఁగు నెత్తుట యొక యతిశయములోఁ జేరెసదగునా" యని యెంచువారును, కొందఱు "పిన్ననాఁడే తల్లిచంకనుండి జారి బండపైఁ బడి బ్రద్దలుచేసిన వజ్రకాయుం డగునీతని కిక్కరిమద నుడంచుట యొకలెక్కలోఁ జేరిన దగునా" యని యనుకొనువారును నై యుండిరి. పాకారియుఁ దనదైరావతము పడినపాటును భీముని బలంబును గాంచి గడగడ వడంకి, "యోగాడ్పుపట్టీ! ఇది పూర్వము పాలసముద్రమును మథించుకాలమున నాకు గౌరవవాహనముగా లభించినది. అట్టి

* నిలింపులు=దేవతలు.

దీనిని నీ విట్లు నిర్లక్ష్యముగాఁ గొనిపోవుటవలన నా గొప్పతనమునకుఁ దప్పక హానికలుగును. ఇంతియ గాక మీగౌరవాతిశయమునకును గొఱఁత కల్గునని యెఱుంగుము. ఎప్పుడు నీకర మిక్కరిశరీరమున సోఁకినదో యప్పుడే దీనిమదము నశించె. కావున నిపు డొక్కనిమిషమాత్రము నిదానింతువేని దీని నలంకరింపఁజేసి నీవెంటం బుచ్చువాఁడ" నని చెప్పి "యీసామజరాజమును గొనిపోయి శీఘ్రముగా శృంగారించి యిటకుం గొనితెం" డని తనభటుల కాజ్ఞ నొసంగె. వారు తమప్రభునాజ్ఞఁ దలఁ దాల్చి యాదంతికట్లు విప్పి వేఱొండుచోటికిం గొని పోయి నానావిధవస్త్రభూషణాదులచే దాని నలంకరించి మఱల *జిష్ణునియాస్థానమండపమునకుం గొని వచ్చిన దాని నయ్యింద్రుఁడు సహస్రనేత్రములం దిలకించి యానందించినవాఁడై యావల సభనంతయుఁ దేరఁ బాఱఁజూచి యందున్న సిద్ధవిద్యాధరాది యక్షగణంబులను నారదాది మహర్షితండంబులం గనుంగొని మీరలు కల్పవృక్షకామధేనుచింతామణి మొదలగు దివ్యవస్తునిచయములను నమరకాంతా సమూహములను మీ వెంటఁ బెట్టుకొని యీసామజరాజముతోడ భీమసేనుని వెనుఁదగిలి హస్తి

* జిష్ణుఁడు=ఇంద్రుఁడు.

నాపురంబునకుం బోయి యచ్చట గొంతినోము నయనానందముగఁ దిలకించి యామెనుఁ జెప్పు టివలె నిచ్చటికి వచ్చి చేరుం"డని వారి కాజ్ఞాపించి యనిపె.

అంత నాదేవకరి తనచుట్టు నూఱుకోట్ల దేవతలు సేవించుచు రాఁగా నింద్రనందనుం డొనర్చిన సోపానమార్గమున మహాదద్భుతముగాఁ గరిపురము నకు వచ్చుచున్న నక్కరిని దేవతండమును ధర్మనందనుండును, దనసోదరవర్గమును, ధృతరాష్ట్రవిదురాదిపెద్దలును దూరముననే నుంచి పులకితశరీరులై శిరంబులం గరంబులు మొగిడ్చి వందనములాచరించుచుండిరి. అయ్యమరులును వారి మ్రొక్కులఁ గలరి దిగ్గజరాజముతోడ భువి కవతీర్ణులై పురబాహ్యమున నిలచియుండిరి. వారిం గాంచి ఫల్గునుండు పరమానందభరితహృదయుఁడై వెంటనే తల్లికడ కరిగి నమస్కరించి "యవ్వా! నాప్రతిన యొనర్చిన మేరకు బిడౌజుని యైరావతముతోడ సమస్త సంపదలం గైకొని వేల్పులదె మనభీమసేనుని వెంటఁ బురము వెలుపల వచ్చి నిలచియున్నవారు. కానఁ దడవుసేయక వ్రత మాచరింప యత్నింపుము."
ని పలికిన కొడుకుం గుంతి కౌఁగిటఁ జేర్చినదియై యానందించుచు "నోపుత్రరత్నమా! నేఁడు నీభుజ

బలసత్త్వముచేఁ బాండవభోజవంశములు రెండును స్వర్గమర్త్యపాతాళలోకములం బొగడందగి పావనం బయ్యె" నని పలుతెఱంగులం గొనియాడి యుత్సవిడ్భారిపి పిమ్మట వ్రతమాచరింప నుత్సాహము గలదియై పుణ్యజలంబుల మంగళస్నాన మొనర్చి సుకూలవస్త్రములం గట్టి దివ్యపత్రమాల్యాభరణాదులఁ దాల్చి బంగరుపాలకిపై నెక్కి పుణ్యాంగనలఁ గొందఱఁ దనవెంటఁ గొని గాంధారీదేవిమందిరంబున కరిగి యద్దేవిపాదకమలముల కెఱఁగి, "అక్కా! నేఁడు నే నైరావతవ్రత మనుష్ఠింపఁ దలఁచితి. అందులకై మనకవ్వడి యమరేంద్రుని వీటంగల సమస్తవస్తునిచయముతోఁ డ నైరావతమును బురబాహ్యమునకుం దెచ్చియున్నవాఁడు. అగుటం జేసి తామును నాతోడ నానోమునోమ నచటికి విచ్చేయవలయు" నని ప్రార్థించిన విని సుబలనందన తనలో "నాహా! ఈకుంతి మున్నేను వ్రతమొనర్చునపుడు తన్నుఁ బిలువకుంటి ననునసూయచే నేఁడు నాకుం జిన్నతనముగలిగింపవలయునని యెంచి కవ్వడివలన దేవేంద్రునిదివ్యవస్తుచయమును నైరావతముం దెప్పించుకొని యొప్పునకై నాతోడ నోము నోమ నీవును రావలయునని పలుకుచున్నది. ఔరా! నే నంత వేలనగుదునే! నా కెంతసంపదయున్నను నెందఱుసుతులున్న

ను నేమి ప్రయోజనము? పట్టపుదేవివై పరాక్ర మవంతులగు నూర్గురుసుతులం బడసినగాంధారి మంటివానుంగును బూజించె. పేదరాలికి మాత్ర నేవు రుసుతులతోడం దనకడ జీవించుచున్నకుంతి యు మరకరిం బూజించె నని లోకులాడుకొని నవ్వరుం దురా? ప నెంతబుద్ధిమాలినపని సేసి నాకును నాసుతులకును నవమానముం దెచ్చుకొంటివి? ఇంక గడచినకార్యమునకుం జింతించుట గతజలసేతుబం ధనమువంటి"దని నిశ్చయించి కపటము లేనిదాని వలె నటించుచుం "జెల్లెలా! నేనేల? నీవే వ్రతమొ నర్చు"మని ప్రత్యుత్తరమిచ్చె. అదివిని కుంతి యేమి యుం దోంచనిదై కొంతతడ వూరకుండి పిదప "అక్కా! భాగ్యవంతులతో భాగ్యవంతులును, బీదలును గలసిమెలసి యుందురుగాని, బీదలతో నొకప్పుడైనను బీదలును భాగ్యవంతులును గలసి మెలసి యుండరని జను లాడుకొనుచుందురుగదా! అదేవిధి మేము పేదలమగుటచే మాయందుం గొం చెమేనియుం గనికరములేక రానని వచించుట నీకుం బాడి యగునా!" యని నిష్ఠురోక్తు లాడిన నవి యా గాంధారిచెవులకు ములుకులవలె నాటిన దండతాడిత భుజంగంబుకరణి మండిపడుచు "భళా! నీనిష్ఠురోక్తు లింకం జాలుం జాలింపుము. మేము మృత్తికతో గరి

నోనర్చి పూజింపఁగా నీ వైరావతమునే తెచ్చుకొంటి
వి. దీననెవరు భాగ్యవంతులో ఎవరు పేదలో యది
యందఱెఱుంగుదు" రని కుంతి నెత్తిపొడిచె. అందుల
కాకుంతి "యక్కా! నీవును నాసంపద కర్హురాలవే
కదా! అది యట్లుండనిమ్ము. ఒకవేళ నీకు నాయం
దుఁ గరుణ లేకయున్నను నీపట్టియగు పార్థునియందైన
నను గరుణగలదానవై మాయాడక నాతోఁ బనోము
నోమ రావలయు"నని బలాత్కరించుచు బతిమాలు
చున్న పాండుసతిని ధృతరాష్ట్రదేవి కన్నెత్తి
చూడక చిడిముడిపాటు వర్తించుచు "నన్నేల
బలాత్కరించెదవు? నేను మున్ను నిన్నుఁ బిలిచిన
గదా నీవు నన్ను బిలువవలయు. అదిలేమిం
జేసి నీపొత్తు నాకును, నాపొత్తు నీకును వలదు
పోపో" మ్మని ధిక్కరించి పలికె.

అంతటఁ గుంతీదేవి యేమియుం బలుకనేరక
యచటనుండి కదలి భీష్మునిమందిరంబునకు వచ్చి
యందు విదురసహితుఁడై యున్న *గాంగేయునిచర
ణకమలములకు మ్రొక్కి తాను గాంధారీదేవిని
వ్రతమాచరించుటకు రమ్మని పిలుచుటయు, నందుల
కాతవ్వి వచించినదంతయు నతని కెఱింగించిన నా
శాంతనవుఁడు విని "ఓసాధ్వీమతల్లీ! తాను నిన్నుఁ

* గాంగేయుఁడు=భీష్ముఁడు.

బిలువకున్నను నీవు తన్నుఁ బిలిచినది యుత్తమము. అట్లు పిలిచియు రాకుండుటచే నందులకు మన మేమి చేయఁగలము?" అని యామె నూఱడించి "యమ్మా! వ్రతనిర్ణయకాలము సమీపించినదగుటచే నింకఁ దడవు సేయక నీ వక్కఱియున్న చోటికి కరుగవలయు. అదిగో చూడు సమస్తదేశనృపాలురును, బాలురును, స్త్రీలును, వృద్ధులును గుమిగూడి యట కరుగుచున్న వారు. తామసించితివేని లగ్నము దప్పిపోవును. అంతట సర్వమును విఫలమగు"నని చెప్పి యథోచితముగాఁ దనకుఁ గలిగిన దివ్యాభరణాను లొసంగి యామెను దనవెంట నిడికొని పురంబు నిర్గమించి యపురదంతావళం బున్నయెడ కరిగిన నాకుంతి యచటికి వచ్చియున్న ప్రజలం గనుంగొని సంతసించినదియై తటాలునఁ బాలకిం డిగ్గి యైరావత ముకడకుఁ జేరి దానిం గంధపుష్పదీపధూపాదులం బూజించి పిదప వరుసగాఁ గల్పవృక్ష కామధేను బృందారకసందోహంబుల నర్చించి తదుపరి దేవాప్సరసలగు రంభాదిస్త్రీలను దుంబురునారదాదిముని గణంబులను వారివారిం దగినభంగి సత్కరించి యందఱం దనవెంటఁ బెట్టుకొని యటకు దాపునఁ బరమపావనియై యొప్పుచున్న భాగీరథీనదికిం జని స్నానమొనర్చి యిసుకతో శివలింగము నొనర్చి

దానినిసాంగముగ నానావిధములఁ బూజించి యనంతరము దనతోడవచ్చిన పుణ్యకాంతలకుఁ బెక్కువాయనదానంబు లొసఁగి బ్రాహ్మణోత్తములను ధనధాన్యభూధేనుసంతతులచేఁ దృప్తినొందించి పేదలకును యాచకులకును సంతృప్తికరముగాఁ గోరినవానినెల్ల నొసంగి యటనుండి యింద్రకరి నెక్కు వేడుకతోఁ దాను దనసుతులు పెద్దలు మున్నగువారితోడ నది యున్నచోటికేగి నమస్కరించిన నగ్గజము దటాలున భువికి వంగి తనవీఁపునం గొంతి నెక్కించుకొనియె. అదిగని దేవత లానందంబునం బారిజాతాదిదివ్యసుమవర్షంబు గురియించి దుందుభిధ్వను లొనర్చిరి. రంభాదివేశ్య లరుదుగా నాట్యములు సలిపిరి. తుంబురునారదాదిమహర్షులు మిక్కుటముగా నాశీర్వాదము లొనర్చుచుండిరి. మఱియు నయ్యవసరంబునఁ గొందఱు నిర్జరాంగనలు బృందారకేంద్రుని యనుమతంబున సంపూర్ణసుధాకరబింబంబుంబోలిన వెలిగొడుగుఁబట్టుచుండఁగా మఱికొందఱు దేదీప్యమానములగు బహువిధరత్నములం బొదుగఁబడిన వింజామరల నిరుపార్శ్వముల వీచుచుండఁగాఁ గొందఱు సిద్ధవిద్యాధరఖేచరగణంబులు వెనుక ముందఱం గొలుచుచుండఁగా నిఖల

భూసురాంగనానివహంబును నలుగెలంకుల సేవిం
చుచు రాఁగా ధృతరాష్ట్ర భీష్మ విదుర ధర్మజ
భీమార్జున నకుల సహదేవులును దక్షిణ నాత్మజనం
బులను నుత్సహించుచు ముందు నడువఁగా, భూ
సురులయాశీర్వాదంబులు మిన్నుముట్టుచుండ వంది
మాగధ పాఠకజనంబులు స్తోత్రపాఠము లొనర్చు
చుండఁ జూచువారలకు నయనానందకరంబుగాఁ
బురంబులోనికిఁ బ్రవేశించి పోవునెడ నప్పత్తనంబు
నం గలస్త్రీలును,బురుషులును,బాలకులును, ముదు
సళులును బ్రతివీధిని మెద్దెలయందును మేడలయం
దును, ముంగిళులయందును గుంపులుకట్టినవారై
"యాహా! గాంధారికింబలె స్త్రీలకు ప్రయోజకులగు
పుత్రులు నూర్గురుండిన వారివలనం బ్రయోజనం
బేమిగలదు? అర్జునుఁ బోలినవాఁ డొక్కరుం డుం
డినం జాలదా! ఇక్కుంతీదేవి తనపూర్వజన్మమున
నేతప మాచరించి యితనిం గనినదో యెఱుంగము.
ఔరా! ఈసాధ్వీమతల్లి నేఁడు లోకమున సాటిలేని
ఘనత వహించె" నని యొకరితోనొకరు చెప్పికొను
వారును, కొందఱు "ఎల్లు,

"శ్లో. శర్వరీ దీపక శ్చంద్రః ప్రభాతో దీపకో రవిః,
త్రైలోక్యదీపకో ధర్మః సుపుత్రః కులదీపకః."

చంద్రునివలన రాత్రియు, సూర్యునివలనఁ బగలును, ధర్మమువలనఁ ద్రిలోకములును, సత్పుత్రునివలన వంశమును బ్రకాశించునని పెద్దలు వచింతురో, యట్లు నేఁ డియర్జునునివలన వంశమున కంతటికిని ఖ్యాతి గలిగెఁగదా" యని చెప్పికొనువారును నై యానందపరవశు లగుచుండిరి. ఇవ్విధంబునఁ గుంతీదేవి మిగుల వైభవముతోఁ బ్రతివీధులయందును మెఱవడిగా నడపటఁ దనమందిరద్వారమునకు సరిగా వచ్చి యనేకమంది సుందరీజనంబులు తన్నుం గొల్చుచుండఁగా లోనికిం జొచ్చి యావచ్చిన స్త్రీలను దగినభంగి గౌరవించి తమతమ యునికిపట్టులకుం బనిచె. అంత సవ్యసాచియు సంతసించుచు వేల్పులం గాంచి "యోదివిజులారా! మీ యేలినవానియనుగ్రహమువలన నేఁడు మజ్జనని నోము సఫలత నొందె. కాన నింకం దడవు సేయక యిక్కరీంద్రమును వెంటఁబెట్టుకొని మీర లీయమ్ముల త్రోవను బురుహూతునిపాలికిం బొండని పుచ్చి

వెంటనే యొక బాణమును సంధించి మున్ను గట్టిన శరసోపానమార్గమును దుత్తునియలు గావించి యనంతరంబచట నూఁగియున్న రాజవర్గములను దమ తమపురంబుల కనిచె. కావున, ఓజనమేజయా! ఈకథ నెవరు విందురో, యెవరు వ్రాయుదురో, యెవరు చదువుదురో, వా రయ్యింద్రునిగృపావిశేషంబునకుఁ బాత్రులై యవిచ్ఛిన్నంబు లగుసంపదలం బడయఁగల" రని చెప్పిన వైశంపాయనుని వాక్యంబులు విని జనమేజయుండు ముదితస్వాంతుండయ్యె.

సంపూర్ణము.

స్వస్త్యస్తు.

---

చెన్నపురి: గోపాలకృష్ణ ముద్రాక్షరశాలయందు ముద్రితము.